# ఇ(ం)తిహాసం

## కవితా కదంబం

### వారణాసి సూర్యకుమారి




## భారతీయ సాహిత్య పరిషత్

మచిలీపట్నం

ఇ(ం)తిహాసం

కవితా కదంబం

రచన :
శ్రీమతి వారణాసి సూర్యకుమారి
21-562-3, పరాసుపేట,
మచిలీపట్నం - 521 001

హక్కులు : కవయిత్రి
ప్రచురణ : అక్టోబర్ 17, 2013

వెల : రూ. 30/-

ప్రతులకు :
శ్రీమతి వారణాసి సూర్యకుమారి
21-562-3, పరాసుపేట, మచిలీపట్నం-521 001
ఫోన్ : 08672 - 251741

ముద్రణ :
బందరు కళ్యాణి ప్రెస్, మచిలీపట్నం-1



# ఇది నారీ హృదయం

సామాజిక స్పృహతో కూడిన రచనలు పాఠకులను ఆకట్టుకొంటాయి. సమకాలీన సమాజంలోని వాస్తవ పరిస్థితులపై అవగాహన కలిగి భావి తరాలకు అందించడంతోపాటు దుష్పరిణామాలను చెండాడుతూ మంచికి బాటలు వేసే రచనలు చేసినపుడు సాహిత్య ప్రయోజనం కలుగుతుంది. శ్రీమతి వారణాసి సూర్యకుమారిగారు అయిదారు తరాల మహిళల పరిస్థితిని నిశితంగా పరిశీలించి మహిళల జీవన పరిణామ క్రమాన్ని అలతి అలతి పదాలతో ఇంతిహాసంలో కళ్ళకు కట్టినట్లు సాక్షాత్కరింప పూనుకోవడం ముదావహం. 32 శీర్షికలతో కూర్చిన ఇ(ం)తిహాసం అయిదారు తరాల మహిళల గురించి విశదీకరించింది. శ్రీమతి సూర్యకుమారిగారు ఆమె చూచిన, విన్న యధార్థ సంఘటనలకు యిచ్చిన అక్షర రూపమే యీ ఇ(ం)తిహాసం!

సుమతి, శిల్ప, దీప్తి, పూజ, ఆమె మొదలగు శీర్షికలతో మగువ మనసును చక్కగా ఆవిష్కరించారు. "తాను కరుగుతూ వెలుగునిచ్చు కొవ్వొత్తికీ, సత్తువ లేక మూలపడిన ముదుసలికి బేధం లేదంటూ" మహిళ ఔన్నత్యాన్ని వివరించారు. "ఆశతో కట్టిరి ముడుపులను, భక్తితో చేసిరి తీర్థయాత్రలను అనేక మొక్కులు మొక్కినను ఫలితము శూన్యమయ్యె" అంటూ సంతానం కొరకు ఇంతులు పడే పాట్లను తెలిపారు. "శాస్త్ర పరిజ్ఞానమ్ము పెరిగి ఆడపిల్ల పుట్టక మునుపె తుదముట్టించుట తగునా?" అంటూ భ్రూణహత్యలపై ఆవేదన వ్యక్తం చేసిన తీరు విజ్ఞానం వినాశం కొరకు కాదు అనే అంశంపై ఆలోచింపచేస్తుంది. "పిల్లల సంరక్షణ కొరకు భరించసాగె నతని దౌష్ట్యము, తన్నులు తిన్నను కిమ్మనకనె" అంటూ మగువ ఓర్పు సహనాలను చాటి చెప్పారు. "కంచెయె చేను మేసె ననంగా కాచు పోలీసులె కాటేయగ స్త్రీలకు రక్షణెచ్చట నుండు" అని "నిర్భయ" లో ఆవేదన వ్యక్తం చేసిన విధము నేటి పరిస్థితికి అద్దం పడుతుంది. "ధనము కన్న ధైర్యము మిన్న, విద్యలకన్న విజ్ఞత మిన్న, బలముకన్న ఆత్మబలము మిన్న" అన్న సందేశం నాటి యువతులకు శిరోధార్యం. శిక్షణలో పెరిగినట్టి సభ్యత, పరిస్థితి తెలిసినట్టి, మనసు, మమత కలిగినట్టి పిల్లల తల్లియె ధన్యజీవి అంటూ ఆత్మ తృప్తి చెందిన మాతృమూర్తి శ్రీమతి సూర్యకుమారి గారు.

శారదామాత కృపకు పాత్రురాలైన పద్యరచయిత్రి శ్రీమతి వారణాసి సూర్యకుమారి గారు గతంలో రామకథాసుధ, సూరి శతకం, వేణునాదం, కవితారామం, ఆదర్శరామా, తెలుగుభాష-సంస్కృతి వంటి రచనలతో పండిత, పామరుల మెప్పు పొందారు. వచన కవితా ధోరణిలో ఆమె రచించిన ఇ(ం)తిహాసం అందరిని అలరిస్తుందని విశ్వసిస్తున్నాను.

**కారుమూరి రాజేంద్రప్రసాద్**
అధ్యక్షుడు
భారతీయ సాహిత్య పరిషత్

మచిలీపట్నం
27-9-2013



---

తే॥ గీ॥ వారణాసి సూర్యకుమారి గారు మాకు
సాహితీ మిత్రులకు గుండె సరసమతియు
అన్ని సాహితీప్రక్రియలందు కూడ
మనసు పెట్టిన సాహిత్య ఘనతమూర్తి

**- డా॥ రావి రంగారావు**
'సాహితీ మిత్రులు' సంస్థ అధ్యక్షులు





**మాదిరాజు రామలింగేశ్వరరావు**
M.A.(Eng)., M.A(Tel), M.A.(Hin, Ph.D.
Reader (Retd.) The Hindu College
# 23/181-1, Agraharam St., No. 1
Ramanaidupet, Machilipatnam - 521 001.
Mobile No. 9441195437

## నా మాట

శ్రీమతి వారణాసి సూర్యకుమారిగారు కలంనుండి జారిన మరొక అక్షర బిందు సంయక్ (సమగ్ర) రూపం ఈ రచన. ఈ చిరుపొత్తం నారీ చిత్తానికి ప్రతిరూపం. "కల్లయుగాదు, కల్పన కాదు, కటిక సత్యములు వ్రాయగ నే కలమును పట్టి" అంటూ చదువుల తల్లికి నమస్కరిస్తూనే తన రచనా లక్ష్యాన్ని ప్రకటించారు కవయిత్రి.

ఆడపిల్లగా పుట్టిన క్షణంనుండి జీవితంలో ఒక స్త్రీ ఎలాంటి బాధలకూ వేదనలకూ గురవుతుందో కవయిత్రి హృద్యంగా చెప్పారు ఈ సంకలనంతో. "పాప యనగానే భీతి కలిగి పాపభీతియు లేక కొందరు భ్రూణహత్యకు పూనుకొనుట"ను గురించి చెప్తూ 'పాపభీతి' అనే శీర్షికలో పాప కల్గిందన్న భీతి అనే అర్థాన్ని పలికించి మంచి కవయిత్రి ననిపించారు. "కనగబోవునది ఆడపిల్లని తెలిసి భర్తా అత్తమామలు కనవలదని శాసించగా అలమటించెను అమ్మాయి" అంటారు. శిశునిర్మాణంలో భర్తకే ప్రాధాన్యత ఉంటుందన్నాక కనీస శాస్త్రీయ జ్ఞానం లేకపోవటం నిజంగా విషాదకరం! "ఈసడింపులతోనే" ఆడపిల్ల బాల్యం గడుస్తుంది అంటారు కవయిత్రి. పెద్దలందరూ చీదరించినా తండ్రి కూడా నిరాదరించినా తల్లి ఒడిలో పెరిగి పాప వ్యక్తిత్వాన్ని సమకూర్చుకుంటుంది అంటారు. అయితే ఆమె యౌవనంలోకి అడుగుపెట్టగానే "ప్రేమించానని" వేణులాంటి కుర్రవాళ్ళు వెంటబడతారు. ఆ అమ్మాయి తీవ్రంగా దానికి అభ్యంతరం చెప్పటంతో "ప్రేమోన్మాదిగ మారి యతడు క్రోధావేశము పట్టలేక యాసిడ్ దాడికి పాల్పడతాడు". ఇలాంటి సంఘటనలేవీ జరగకుండా వివాహం సలక్షణంగా జరిగితే ఆపైన జీవితం విలక్షణంగా వికృతంగా మారుతుంది ఆమెకు.

"అమ్మడు జాతకురాలైతే గార్హస్థ్య జీవితం స్వర్గం, లేకుంటే నరకం" అంటారు సూర్యకుమారిగారు. ఇందుకుగాను ఆమె ఎందరి ఇతివృత్తాలనో వినిపిస్తారు. సుధ, మధులు ప్రేమించి పెళ్ళిచేసుకుంటారు. వాళ్ళకు ఒక

కొడుకు పుడతాడు. కానీ అనుకోకుండా మధు విదేశాలకు వెళ్తాడు. సంవత్సరం తర్వాత ఒక జర్మన్ యువతిని వెంటబెట్టుకుని వస్తాడు. మనసు విరిగిన సుధ తన బిడ్డను తీసుకుని ఇల్లు విడిచి వెళ్ళిపోతుంది. మరొక యువతి లలిత. ఆమె భర్త త్రాగుడుకు బానిసై భార్యను వికృత చేష్టలతో విసిగిస్తాడు. ఆఖరికి ఉన్నత పదవి కోసం తన పై ఆఫీసరుకు భార్యను పణంగా పెట్టాలని చూస్తాడు. మరొక "ఇందు" కథ. ఇంజనీరుగా పనిచేస్తూ కూడా ఒక సంఘటన మూలంగా భర్తకు దూరమవుతుంది. కారులో ఇంటికి వస్తూంటే డ్రైవరు ఆమెపై అత్యాచారానికి ప్రయత్నిస్తాడు. ఆమె తెలివిగా తప్పించుకుంటుంది. ఇంటికి వస్తే "వింతగ చూసెను పతియు సతిని, చెరిగిన బొట్టు, చెదిరిన కట్టు, రేగిన జుట్టు బట్టి తలచెనతడు మానభంగమైందని". "తనను నమ్మని భర్తను గనుచు దిక్కుతోచక శిలయై నిలిచి"పోయింది ఇందు. మరో నీరజ కథ. ఒకతుంటరి చేతిలో ఆమె భంగపడుతుంది. 'ఆత్మరక్షణ' చేసుకోవటం చేతకాక ఆమె నిస్సహాయంగా నిలబడిపోతుంది.

అయితే ఈ కథలన్నింటిలోనూ నేటి సమాజంలో స్త్రీకి జరుగుతున్న అన్యాయాన్ని ప్రస్తావిస్తూనే "పురుషాధిక్యతను కవయిత్రి నిరసించారు. పై అధికారి హద్దులు మీరితే చెంపదెబ్బ కొట్టి గుణపాఠం చెప్పిన "దీప"ను కూడా మనం ఈ కవితల్లో చూస్తాం" అలాగే తనపై యాసిడ్ పోసిన వేణుని పోలీసులకు పట్టించి శాంతిస్తుంది సుమతి. అలాగే తనను పదోన్నతికోసం పెట్టదల్చిన భర్తను గూడా పోలీసులకు అప్పగిస్తుంది లలిత.

"పూర్వకాలము స్త్రీలు కారే నేటి వారు అన్యాయము నెల్ల సహించరు ప్రకటిస్తారు ధైర్యంగా తిరుగుబాటును" అంటారు.

సంప్రదాయ వాదిగా నాకు తెలిసిన శ్రీమతి సూర్యకుమారిగారు ఇందులో "స్త్రీవాది"గా కన్పించారు. అయితే దీన్ని వాదంగా కన్నా వేదనగానే తీసుకోవాలి. ఆత్మస్థైర్యంతో ముందుకు సాగటం వలనే స్త్రీజాతికి అభ్యున్నతి కలుగుతుందని కవయిత్రి ఇందులో సందేశం ఇచ్చారు. కవితలన్నీ వాస్తవానికి ప్రతిబింబాలే కనుక వస్తువును గురించి వేరే చెప్పాల్సిందేమీ లేదు. అయితే "శిల్పం" కొరవడింది. చాలా చోట్ల కవిత్వం పల్చబడింది. "వృద్ధాప్యంలో ఇరువురికీ తరాల అంతరాలు తప్పవు. సర్వసామాన్య సమస్యలూ సాధారణమే". ఇలాంటి పంక్తులు ఖండికలూ ఈ పుస్తకంలో అక్కడక్కడా కన్పించి కొంచెం ఇబ్బంది కల్గిస్తాయి. అలాగే పుస్తకం పేరు ఇ(ం)తిహాసం. స్త్రీ చరిత్ర తరతరాలుగా



ఇలా ఉంది అని కవయిత్రి చెప్పినప్పుడు "ఇతిహాసం" సరిపోతుంది. "ఇంతి హాసం" అన్నప్పుడు కొంచెం దూరాన్వయం చేసుకుని అర్థం చెప్పుకోవల్సి వుంటుంది. సమాజపు నిరంకుశత్వంపై స్త్రీ "నవ్వు"తో సమాధానం చెప్తుంది అనుకోవాల్సి వస్తుంది. ఆత్మస్థైర్యాన్ని ఇందుకు ఆలంబనంగా చెప్పుకుంటే సరిపోతుంది.

శ్రీమతి సూర్యకుమారిగారు ఒక నూతన ప్రయోగం చేశారు ఈ పుస్తకం ద్వారా! వారికి నా అభినందనలు.

**- మాదిరాజు రామలింగేశ్వరరావు**



# మనసు మధనం

యత్ర నార్యస్తు పూజన్తే రమన్తే తత్ర దేవతా

పూర్వకాలము నుండీ అందరికీ తెలిసినదే ఐనా అప్పటినించి ఇప్పటివరకూ కూడా స్త్రీల పరిస్థితి మామూలే. 5,6 తరాలనాటి వారి కంటే కాస్త మెరుగే అని సంతోషిద్దాం అనుకున్నంతలో అవన్నీ పైపై మెరుగులే అన్నట్లుగా అనేకానేక దుర్ఘటనలు జరుగుతూ స్త్రీలను వయోభేదం లేకుండా హింసించడం గమనిస్తూంటే మనసులో మధనపడడం కంటే ఏమీచేయలేని పరిస్థితి. బాధ ఇతరులతో పంచుకుంటే తగ్గుతుంది అంటారు కదా అని....

నాకు 6 తరాలనుండి ఎంతో పరిచయమున్న స్త్రీల జీవన పరిణామాలు గమనిస్తూంటే చిత్రమైన స్పందన కల్గుతుంది.

మొదటి తరం 'ఆవిడ' నిరక్షరకుక్షి. 8 ఏండ్లకే బాల్యవివాహం జరిగింది. 14 ఏండ్ల వయసులో ఆమె గర్భిణిగా ఉండగా భర్త ప్రమాదంలో మరణించడంతో బాలవితంతువుగా పుట్టిల్లు చేరి బిడ్డను కని అనేక కష్టములతో ఆ బిడ్డను పెంచి 3వ తరగతిదాకా చదివించి 10వ ఏట పెండ్లిచేసింది. పుట్టిన బిడ్డ 'ఆడపిల్ల' కావడంవల్ల ఆస్తిలో హక్కు లేదని ఏమీయివ్వక అన్యాయంచేశారు. అదిగో అక్కడే ఆడామగా తేడా!

రెండవతరం అమ్మాయి మూడోక్లాసు చదివి 10 ఏళ్లకే పెండ్లై 15వ ఏట బిడ్డని కని మగపిల్లవాడు కావడంతో చదివాడు.

3వ తరం కోడలు 6వ క్లాసు చదివి 15 ఏళ్ళకే పెళ్ళి. అప్పటినించి వరస కాన్పులు. అదే లోకం.

ఇక 4వ తరం వచ్చేసరికి కాస్త స్త్రీ విద్యకి ప్రోత్సాహం లభిస్తూండడంతో కొంతమంది చదువుకోగలిగేవారు. కానీ పల్లెటూళ్ళల్లో స్కూళ్ళు సదుపాయాలు లేక కొంత ఛాందసంవల్ల కొంత ఆడపిల్లలకి చదువు లెందుకు? ఉద్యోగాలుచేసి ఊళ్ళుయేలాలా? అని నిరుత్సాహ పరచేవారు. కానీ పట్టుదలతో సాధించి హైస్కూలు చదువు ముగించ



గలిగింది పెళ్ళినాటికి. కాలేజీ చదువుకు మాత్రం నోచుకున్నవాళ్ళు ఏ కొద్దిమందో ఉండేవారు ఆరోజుల్లో.

ఇక 5వ తరం అమ్మాయిలు. మగపిల్లలతో సమానంగా పోష్టు గ్రాడ్యుయేషన్లు, డాక్టరేట్స్‌కూడా కాగలిగారు. మనసైనవారిని మనువాడ గలిగారు. 6వ తరం అమ్మాయిలకి అడ్డేలేదు. కోరిన చదువులు, ఉద్యోగాలు. గ్రామాంతరాలే కాదు దేశాంతరాలూ వెళ్ళి చేస్తున్నారు. మొదటిరకం వారి కంటే ఎన్నోరెట్లు పురోభివృద్ధి సాధించి ప్రగతిపథంలో జీవనయానం సాగిస్తూ కోరుకున్నవారిని కల్యాణమాడి సుఖంగా ఉంటున్నారు. ఇది చాలా సంతోషించతగిన విషయమే. ఏ సమస్యలూ లేకపోతే?

కానీ ఎంతమందికి అది సాధ్యమౌతోంది? ఉద్యోగరీత్యా ఒంటరి ప్రయాణాలు, నైట్ డ్యూటీలు తప్పనిసరి ఔతున్నప్పుడు స్త్రీలకి తగిన రక్షణ లభ్యమౌతోందా! దురాచారాలకి ఒక ప్రదేశమని లేదు. ఒక సమయమూలేదు. ఎల్లవేళలా ప్రమాదం అంచునే పయనం పడతికి అన్నట్లున్నదికదా! ఈమధ్య వార్తాపత్రికల్లో ఇటువంటి వార్తలులేని రోజుందా! ప్రయాణించే రైలులోనూ జరిగే. రక్షకభటులే రాక్షసులుగా మారుతుంటే ఎవరిని శరణుజొచ్చేది?

ఉన్నంతలో ఘనంగా పెళ్ళిచేసి పంపిస్తే దినదినగండం అమ్మాయి కాపురం! కట్నం కోసం అత్తవారి దౌర్జన్యం! భర్తపైశాచికత్వం. కొందరిలో అనుమానరోగం. ఎంత చదువుకున్నా, సంపాదనాపరురాలైనా కుటుంబ గౌరవం కోసం స్త్రీ కుములుతూ ఓర్పుగా సహించడం తట్టుకోలేనినాడు ఆత్మహత్య. ఇంతేనా స్త్రీ జీవితం? కాళ్ళపారాణి తడి ఆరకముందే తనువు చాలించిన అమ్మాయిని తలుచుకుంటే గుండె నీరైపోతుంది.

ఆర్థిక స్వాతంత్ర్యం లేని ముందు మూడుతరాల వారికన్నా తదుపరి వారు స్వతంత్ర జీవనం చేయగలుగుతూండడంతో ధైర్యంగా ఎదిరించి నిలబడగలుగుతున్నారు. పిరికితనం కాస్త సడలి.

ఏమైనా ఎన్ని యిబ్బందులు ఎదురైనా గుండెధైర్యంతో ఎదుర్కొని తన సామర్థ్యం నిరూపించుకోవాలన్నదే యువతకు నా సలహా!

తప్పు చేస్తే తలఒగ్గాలికానీ తప్పు చేయనప్పుడు బ్రతకడానికి భయమెందుకు?

నేను విన్నవీ, కన్నవీ, వార్తలలో చదివినవీఅన్నీ గుర్తుచేసుకుని రాద్దామని మొదలుపెట్టిన తర్వాత కూడా ఎన్నో కొత్త సంగతులు వెలుగులోకి వచ్చి ఇందులో చోటుచేసుకున్నాయి. ఇంకా ఫుల్‌స్టాప్ పెట్టకపోతే యింకా రోజూ జరుగుతున్న దుర్ఘటనలు చేర్చవలసి వస్తుందేమో అన్నభయంతో ముగించేస్తున్నాను.

ఎప్పుడూ పద్యాలేనా అనుకుంటారని ఈమాటు వచన కవిత ధోరణిలో, నేచెప్పదలుచుకున్నది వీలుగా ఉంటుందని నూతన ప్రయోగం చేశాను. అందరికీ తెలిసిన సంగతులేకానీ చర్చనీయాంశము కనుకనూ పరిష్కారమార్గం పదిమందీ ఒక్కసారి ఆలోచించగలరని ఆశతో ఈ ప్రయత్నం.

అడిగిన వెంటనే సహృదయంతో నాకు మంచి సలహాలనిచ్చు గురుతుల్యులు 'సాహితీమిత్రులు' సంస్థాపక అధ్యక్షులు డా॥ రావి రంగారావు గారికి సర్వదా నా కృతజ్ఞతలు. అలాగే...

అమ్మా! అంటూ ఆత్మీయంగా పలుకరిస్తూ నా రచనలపట్ల సద్భావం కలిగిన భారతీయ సాహిత్య పరిషత్తు అధ్యక్షులు శ్రీ కారుమూరి రాజేంద్రప్రసాద్ గారికి నా మనఃపూర్వక కృతజ్ఞతలు.

బహుభాషా పండితులు, నా రచనలకు మంచి విశ్లేషకులు, మీరు వ్రాయగలరు అంటూ ప్రోత్సహించు డా॥ మాదిరాజు రామలింగేశ్వరరావు గారికి నా కృతజ్ఞతలు.

సెలవు.

**వారణాసి సూర్యకుమారి**



# అంకితం



1. పిల్లల అల్లరన్న మురిపెము
చిలక పలుకులన్న మధురమే
వారికి మనుమలన్న ప్రాణము
వారె మా తాతగారు మామ్మ

2. వారసులంచు కొల్లగ పంచు
ప్రేమకు కొలమానముండునా?
కీర్తిశేషులు । వారి కంకిత
మిత్తు నీ పొత్తము మమతతో ॥

మా తాతగారు **శ్రీ భాగవతి సుబ్బారావు**
మా మామ్మగారు **శ్రీమతి సూర్యకాంతము** గార్లకు
గుండెనిండుగ అభిమానంతో

మనుమరాలు
**వారణాసి సూర్యకుమారి**

# ఇ(ం)తిహాసం

## గణేశా



1. నమ్ముకొంటి గణేశ నిన్నూ
వ్రాయబూనితి గేయములనూ
కదము త్రొక్కగకలము, బలమును
కలుగజేయి గణేశ!

2. వేడుకొందును విఘ్నదేవా
ముచ్చటగ ముత్యాలసరాలు
గుచ్చనెంచితి వరుస గూర్చియు
అందము చిందించనిమ్ము!

3. వ్యాసభారతమువ్రాసి నీవు
నాటి కథలను తెలిపినావూ
నేటి భారతమునూ నీవిక
తెలుపుమయ్య గణేశ ॥

## శ్రీవాణి



1. చదువులతల్లి! చల్లగచూడు
ఎల్లరు తలతు రమ్మురా! నిన్ను
కొల్లగ కోర్కెలు తీర్చగనూ
కొలుతుము తల్లి! ఎల్లప్పుడున్

2. కల్లయు కాదు కల్పనకాదు
కటిక సత్యముల వ్రాయగనే
కలమునుపట్టి వేడుచుంటిని
కరుణించు కల్పవల్లీ!

3. ముచ్చటగ ముత్యాలపేరును
నీకు హారముగ వేయనెంచి
వ్రాయబూనితి చక్కగ నాకు
అండగదమ్మ భారతీ!



## ఇంతి పురోగతి

1. తరతరాల తరుణుల చరిత్ర
తరచి చూడ కందుము ప్రగతిన్
అడుగడుగున అవరోధములూ
అబల అసహాయతనూ

2. ఆడపిల్లకు ఎనిమిదేండ్లే
పెళ్ళివయసు మగవారికైన
పరిమితి లేదు వయసు అది మా
తాతల కాలము మాట

3. జన్మహక్కు బహు భార్యాత్వము
పురుషులకదియె అలవాటుగ
మారగ స్త్రీల పాలిట శాప
మయ్యె నానాడు.

4. బాల్యవివాహము వేడుకలూ
బాల వితంతుల వేదనలూ
కానవచ్చును సాంఘికదురా
చారముల్ తరచుగా.

5. సతీసహగమనమ్ము కొన్నాళ్ళు
భర్తృహీనకు ఏక భుక్తము
వస్త్రధారణ, కేశ ఖండన
ప్రత్యేకతలు కొన్నాళ్ళు

6. సంఘసంస్కర్తలు అరికట్టి
మనుజులలోన తెచ్చిరి మార్పు
అతివ బ్రతుకున కర్థము తెలిపి
రా వీరేశలింగమాదులు

7. తరములు మారి తరుణులింకను
గ్రహించిరి తమ విలువ నంతట
బాధ్యతలు నిర్వహించుటలో
పరిపూర్ణతను పొందిరీ

8. చదువు సంధ్యలు నేర్చుకున్నది
మెదడుకు పదును పెట్టినదింక
ఆత్మవిశ్వాసమును పెరుగగ
ధైర్యంగా నిలబడె నతివ

9. పురుషాధిక్యత నణచగనూ
ఆరాటముగ పోరాటమును
సాగిస్తూ సమాన హక్కులు
కోరుకుంటూం దీనాడు

10. సంసార మనెడు బండిలాగగ
ఆలుమగలూ అలుపనక నే
మోయ బరువును సమానంగా
సుఖము, శాంతీ లభించేది

## 2. జీవితం

1. బాల్యము యౌవన కౌమారం
ఇంక వార్ధక్యముల్ స్త్రీపురు
షులకు సమానములే కానీ
వారి అనుభవములే వేరు

2. ఆడపిల్లను ఈసడింపుల
పెరుగుతూనే బాల్యము గడచి
అడుగిడుతుంది యౌవనంలో
అమ్మాయి సహజంగా



3. ఈడువచ్చిన పిల్లకి పెళ్ళి
చేయాలంటూ చదువు ఆపి
మూడుముళ్ళూ వేయించేసి
అదే జీవితం అంటారు

4. అమ్మడు జాతకురాలైతే
గార్హస్థ జీవితం స్వర్గం
లేకుంటే నరకం! అట్లే
సాగిపోతుంది కాలం

5. పెళ్ళి, పిల్లలుతో యౌవనము
కౌమారం గడచిపోతాయి
కష్టసుఖాలతో కాపురం
ఇంక వృద్ధాప్య మారంభం

6. వృద్ధాప్యంలో ఇరువురికీ
తరాల అంతరాలు తప్పవు
సర్వ సామాన్య సమస్యలూ
సాధారణమే!

7. అప్పుడు ఇప్పుడు ఎప్పుడైన
సమాజంలో స్త్రీపురుషులకు
వివక్ష చూపడంలో మార్పు
మాత్రం లేదు కదా!

8. నాటి మహిళ మనుగడ చూచీ
నేటి మగువ తెగువను నేర్చీ
పోరును సల్పుతోంది సమాన
హక్కులు కావాలంటూ!

# 3. పాపభీతి

1. 'పాప' యనగానె భీతి కలిగి
పాపభీతియు లేక కొందరు
భ్రూణహత్యకు పూనుకొనుటను
రాక్షసత్వమనందుమా?

2. జాలి లేకను ఆడపిల్లను
సాకనోపక చంపబూనుచు
గోడకి కొట్టినట్టి తండ్రియె
కరడుకట్టిన కసాయి యనగ!

3. పాపను తన కనుపాపవలెన్
కాయవలసిన తండ్రియే ఆ
పాపను రూపుమాప తగునా
అది ధర్మమేనా?

4. ఆడపిల్లను 'ఆడ' పిల్లవె
ఈడపిల్లవు కావటంచును
అత్తఇంటికి సాగనంపుటె
తమ లక్ష్యమందురే

5. బిడ్డను కనుట కెవ్వరైనను
కష్టమొకటియె కన్నతల్లికి
కడుపు తీపియు నొకటె యగునే
కనుక అంతరముండరాదు!

6. కన్నబిడ్డలకు పంచి మమత
బిడ్డలందరి నొక్కలాగే
ఇంచుకంతయు భేదమెంచక
పెంచువారె ధన్యులగును!



7. పసితనము నుండియూ పెద్దలు
బాలబాలికలందు భేదము
చూపుచుందురు కొందరు! అట్టి
భావము మంచిదగున?

8. మగతనము నాధిక్యతనంత
వయసుతోడను పెంచుకొనుచు
పెరుగుచుండును పురుషుడంతట
మగసిరి గలవాడ నటంచు!

# 4. అబల - సబల

1. ముచ్చటగాను మూడవసారి
పుట్టినది చూడు ఆడపిల్ల!
అత్త మూతివిరుపులుతోడూ
మామగారి వెక్కిరింతలూ

2. ఇంక మగపిల్లవాడు లేడు
మనకని ఈసడించెడు భర్త
వైఖరి దిక్కుతోచక గుండె
బరువై కుమిలె నా యబల

3. జన్మనిచ్చిన తల్లి నిస్పృహ
తెలిసినట్లుగ బిడ్డ యేద్వగ
ఆడపుట్టుక అంత అలుసా
అన్నట్లు తోచె నపుడూ

4. పెద్దలందరు చీదరించిన
తండ్రికూడ నిరాదరించిన
తల్లి ఒడిలో పెరిగి పాపయు
వ్యక్తిత్వము కూర్చుకున్నది

5. విద్యవివేక మబ్బి యింకను
అందము చందము అమరినవీ
వినయ భూషణమై నిలచినది
అందరినీ ఆశ్చర్యపరచింది!

6. పనీపాటల అమ్మకు తోడు
ఆర్థికముగా అయ్య కండగ
నిలిచి కలతను చెందకుండగ
చేసినది కన్నవారినీ

7. ఇంటిలోవారునూ సంతస
మందిరి! మెచ్చుకొనిరి ఎల్లరు
అబ్బాయిల కన్న మిన్నయే
ఈ అన్నులమిన్న యంచు

8. ఒడిదుడుకులను తట్టుకొనుటను
ఓర్పునేర్పు చూపుటలోను
ఇంతి ఆదర్శమన్నదామె
అనుకున్నది సాధించినది

9. నిర్మలబుద్ధి నియమపాలన
త్యాగమ్ములను వనితలు
చేయగలరని నిరూపించియు
సబలగా నిలిచిందీ!





## 5. తరంతరం నిరంతరం

1. ఊరిలో సంపన్నులు వారు
సంతు లేకను సంకటపడుచు
నోము లెన్నియొ నోచినంతట
కలిగింది వారికో ఆడపిల్ల

2. లేకలేకను పుట్టిన పట్టి
పెంచిరి వారును గారాముగా
బిడ్డ మారాములకు మారాడ
కుండ తీర్చిరి పేచీలు

3. ముద్దుగ పెంచి ముద్దుగుమ్మకు
ఏరికోరీ తెచ్చిరి వరుని
సంబర పడిరి చేసి కల్యా
ణమును ఘనముగాను

4. వియ్యాలవారు కయ్యమాడ
అల్లుని అలక లన్నియు చూడ
పుట్టిన దిగులు ప్రక్కకు పెట్టి
బిడ్డనంపిరి వారు

5. కానుకలు కట్నాలు చాలా
చీరెసారెలు ఆభరణాలు
పెట్టెల నింపి పట్టినంపిరి
ముచ్చటపడుచును వారు

6. ఆరునెలలూ గడచులోపల
చూచి వచ్చిరి ఆరవసారి
కలకలలాడు కాపుర మంచని
మురిసిపోయిరి మదిలోనా

7. అత్తమామల ఆరడులన్ని
భర్తపెట్టే చిత్రహింసలు
చెప్పలేదూ తల్లి తండ్రికి
లోలోన దాచుకొన్నది

8. వచ్చిరి అల్లుడు కూతురూను
నిండుగ పండుగ జరిగినదీ
దండిగ బహుమతు లందుకొనియు
అల్లుని ముఖము విడలేదు

9. అల్లుని ఆశ, అమ్మలుపడే
పాట్లు అత్తింటి అగచాట్లూ
తెలిసి మేనత్త కథ తిరిగీ
పునరావృతమైన దనిరీ

10. మాది మేనత్తకాలము కాదు
పిరికిగ తనువు చాలించుటకు
అన్నది యా చిన్నదప్పుడు
ధైర్యం చెబుతూ తల్లికి

11. గిర్రున తిరిగెను వత్సరమ్ము
పండుగనాడు కూతురల్లుడు
కన్నులకు పండుగై యుండగ
ముదమున పొంగిరి వారు

12. ఓరిమితోడను తెలివిగలిగి
అత్తవారిని తీరు మార్చిన
బిడ్డను చూచి మనసులోననె
దీవించిరి వారూ



## ౬. ఆత్మాభిమానం

1. పుట్టి, పెరిగింది పాప దీప
సోదరులతో సమానంగా
చదువు, ఉద్యోగమూ కూడా
సాధించ గలిగింది

2. వృత్తివిద్యల నారితేరీ
దీక్షతో కర్తవ్యమునెల్ల
నిర్వహించగలిగీ తానూ
సమాన మంది పురుషులతో

3. సమయ పాలన విధేయతతో
పనినిచేయూ దీపపైనను
చూపసాగె పురుషాధిక్యత
నామెపై అధికారి

4. సహించినకొలది యాతండూ
హద్దులు మీరెను అలుసుచేసి
చూపెనప్పుడు కోపమామెయు
తోకత్రొక్కిన తాచువోలె

5. చెంపదెబ్బను కొట్టెను దీప
తేలు కుట్టిన దొంగవోలెను
చూచె నాతడు నోటను మాట
రాకను కాళ్ళికై తోచగన్

6. ఆత్మరక్షణ కోరి యామెయు
కూడగట్టుకొనియున్ శక్తిని
అవసరమైన అబల సబలగ
నిలువగలదని తెలిపెను

7. బాల్యవివాహము సహగమనం
లేకపోయిన నేడు కూడను
భద్రత కరువగుచుండె సంఘ
ములోన స్త్రీల కెప్పుడూ

8. ముక్కుపచ్చులారని బాలిక
పైన అత్యాచారము, హత్య!
గృహిణి సజీవదహనం వంటి
వార్తలు ఘోరం కాదా!

9. ఇంటిలోనూ బయటకూడా
ప్రబలమైన పురుషాధిక్యత
తిరుగుబాటును చేసి మహిళలు
సబలలుగ నిరూపించాలి

10. నిరాశ చెందక ధైర్యముగా
అక్రమాలను ఎదుర్కొనుచూ
సమాజంలో మార్పు తెచ్చే
తెగువ మగువ నేర్వాలి

## 7. సుమతి

1. అందము, తెలివి కలది సుమతీ
చదువున నిల్చు ప్రథమశ్రేణీ
ఆటపాటల చురుకుతనమును
పేరుకుతగిన అమ్మాయి

2. సుస్మిత వదనయున్ సుమధుర
మంజు భాషిణి! ఆమెకుండిరి
మిత్రులు అధికముగను కోరుచు
నెయ్యము చేరునెల్లరు



3. చెలిమికోరి కొందరు చేరగ
కాలముగడుప కొందరుండిరి
ప్రేమపేరిట చేరె నొక్కడు
సుమతి చెంతకూ

4. నామధేయము వేణు యనుచును
వెంటబడెనూ ప్రేమతెలుపుచు
సుద్దులు చెప్పగ సుమతి నతడు
లక్ష్యపెట్టలేదికనూ

5. అనుదినము వల్లెవేయు ప్రేమ
పాఠము వేణువిసుగును లేక
నలుగురి, యెదుటను నగుబాటగు
నని మండిపడసాగె సుమతి!

6. భరించలేకపోయిన సుమతి
తీవ్రముగ మందలించగాను
ఆగ్రహోదగ్రుడైన వేణు
గందరగోళం సృష్టించాడు

7. ఉన్మాదిగనూ మారి యతండు
పట్టలేకను క్రోధముతోను
దాడికి పాల్పడి సుమతిపైన
యాసిడ్‌పోసెను ఆవేశముగా

8. చేతిలనడ్డము పెట్టుకొనగను
ముప్పుతప్పెను మోము పైనను
గుండెలు మండగ కుప్పకూలెను
సుమతి అవమానంతో

9. తలచి కలలోవలె జరిగినది
కాలినచేతితోను, కాలికి
బుద్ధిచెప్పిన వేణుని చూచి
తనలో తానె కుమిలింది

10. విషయము నెరిగి తల్లిదండ్రులు
పరువుకోసము ప్రాకులాడిరి
అల్లరిపాలు కావలదనిరి
గుట్టుగ పడిఉందామనిరి

11. అందుల కొప్పుకొనకును సుమతి
తలచె వేణుకు బుద్ధి చెప్పగ
జన్మకు మరల తప్పు చెయ్యని
విధము శిక్షించదలచెను

12. పోలీసులకు ఫిర్యాదిచ్చి
చట్టరీత్యా శిక్ష వేణుకు
పడిన గాని శాంతించలేదు
సుమతి నేటి మహిళ

13. ఆమె భవితకు భయపడలేదు
దౌర్జన్యాన్ని సహించలేదు
తప్పును సరిదిద్దతలచింది
తగినరీతి బుద్ధి గఱపింది!





## 8. వ్యక్తిత్వం

1. తొలి సహపాఠి సహోద్యోగీ
వారిరువురూ సుధామధూలు
అభిరుచులు కలసిన మనసులన్
దంపతు లైరి వారు

2. నిండుగ కన్నుల పండుగగా
కాపురముండిరి వారిరువురు
దినకరుడు దీప్తి సంద్ర మలల
చందము నుండె నంత

3. కలిగెనేమో దిష్టి వారికి
విసిరివేసెను విధియు దూరము
బదిలి పేరిట నిరువురనింక
చెరియొక వైపునకున్

4. భారమైన మనసులతోనూ
విరహవేదనలోనె వెతుకగ
సాగిరి మధురిమ నిక వారున్
కాలము నెటులో గడుపన్

5. నెలను తప్పిన నెలత నిండియు
నెలలు, పండంటి బాబు కలిగి
నంత పుత్రోత్సాహము పొంగె
వారి మదిలో నెల్లన్

6. మూడునెలలూ ముచ్చట గడచె
వరించె వారి నదృష్టమనగ
విదేశయానము కలసివచ్చి
పెంచె పదవిని మధుకున్

7. విన్నతోడనె వచ్చెను సుధకు
నవ్వు, ఏడుపు కలసికట్టుగ
బిడ్డ పుట్టినవేళ మంచిది
కాబోలంటా రందరు

8. చంటిబిడ్డను సాకుకుంటూ
అత్తమామల నాదుకుంటూ
ఉద్యోగమును చేసుకుంటూ
సుధ ఒంటిగ గడుపుచుండె

9. మధును చూడగ ఎదురుచూపులు
చూచుచుండగ గడచిపోయెను
వత్సరమ్మును! తిరిగి వచ్చెను
మధు ఒంటిగ కాదు జంటగా

10. వెంటనున్నది జర్మను యువతి
తనకు భార్యగ చెప్పినంతనె
గుండె పగిలిన సుధకు నోటను
మాటయు రాకపోయెను

11. రిచ్చవోయిరి తల్లిదండ్రులు
మగడుచేసిన మోసము తెలిసి
మనసు విరిగిన సుధయు ఇంటిని
వీడెను బాబుతోడనూ

12. సుధయు కంటనునీరు పెట్టకె
పతికి బదులును పలుకలేదిక
ఒడిని బిడ్డను విడువనులేదు
పట్టుదల సడలనీయలేదు



13. పూర్వకాలం నాటి స్త్రీలా
పతియె గతియని తలచదింకను
తా నభిమానవతిగ గౌరవం
వ్యక్తిత్వము నిలుపుకొంటుంది

## 9. తల్లి మనసు

1. చేసి రమ్మాయికిని పెళ్ళీ
అందచందాలు, సంపదలూ
యున్న అల్లుని చూసి వారూ
మురిసిపోయిరి ముందుగాను

2. ముద్దుముద్దుగ మూడు ఏండ్లకు
'అమ్మ' యగునమ్మాయి యటంచు
తెలిసినంతనె సంబరపడుచు
దీవించిరి తల్లీ తండ్రీ

3. కనగబోవున దాడపిల్లని
తెలిసి భర్తా అత్తమామలు
కనవలదంచును శాసించగ
అలమటించెను అమ్మాయి

4. శాస్త్రపరిజ్ఞానమ్ము పెరిగీ
ఆడపిల్లను పుట్టక మునుపె
తుదముట్టించుట యనతగునా
పురోభివృద్ధి యని?

5. గర్భవిచ్చిన్నమే కోరిన
పతికి తల్లినికావలె నంచు
ఆశించు సతికి వచ్చె నింక
అభిప్రాయ బేధముల్

6. సంతు వెంటనె వలదనవచ్చు
అసలు వద్దనుకొన్నను సరియె
కానీ భ్రూణహత్యకాదా
నేరమని వాదించింది

7. జీవన రథచక్రములనగను
ఆలుమగలుండవలె నింకన్
మనసులు కలసిన మనుగడయును
సాగు నొడిదుడుకులు లేకన్

8. ముందు తెలియుటె ముప్పు అయ్యెను
ఆడపిల్లని వద్దనిరంచు
దుఃఖపడుచును భర్తతోడను
పంతము పట్టినదీ

9. ప్రథమ పీఠము వేయుటె మేలు
అధిక శాతము స్త్రీలు విద్యకు
ఉద్యోగములకు నేటి ప్రగతి
పిదపనె పెళ్ళి, పిల్లలు

10. తరుణము మించకుండ పొందిన
చాలు ఆడా మగాయన్నది
భేదముండదు తల్లి ప్రేమకు
తల్లి మనసన్న నదియే!





# 10. శిల

1. లలిత పేరుకు తగ్గది యామె
తల్లిదండ్రులు చదువునాపుచు
తెచ్చిన వరుని మారాడకనె
మనువాడినదామె

2. భర్త రూపసికాకపోయిన
గుణవంతుడైన చాలటంచు
మనసులోనే మ్రొక్కె నాశగ
భక్తితో భగవంతుడినీ

3. ఆదిలోనే అబ్బురమయ్యె
క్రొత్తకాపుర మందున కొంచె
మైన ముద్దు ముచ్చట లన్నవి
అందని మ్రానిపండ్లాయె

4. సకల గుణాభిరాముడు పతియు
ముక్కుమీదనె కోపముతోడు
దుర్వ్యసనములకు బానిసాయె
లలిత బ్రతుకు భారమాయె

5. తల్లితండ్రులు మిన్నకుండిన
తనకు తానే ధైర్యమొందుచు
భర్తలో పరివర్తన కొఱకు
ఎదురుచూడసాగె నామె

6. వేళకానీ వేళల యతడు
మధువుతో మత్తుడై లలితను
వికృతచేష్టలను విసిగించుట
వర్ణించనలవి కాదు

7. మిత్రులందరు చేరి యింటను
కల్లుతాగిన కోతులవోలె
గంతులు వేయచూచి లలితకు
మనసు విరిగిపోయె

8. ఉన్నత పదవి కోరిన భర్త
లంచమునిచ్చియు ఆఫీసరికి
మధువు, మగువల నందజేయగ
నెంచినంతనె భయపడె నామె

9. పతి కుయుక్తి నెరిగిన యామెకు
మనసు మారెను కఠినశిలగా
కక్ష పెరిగెను యాతనిపైన
శిక్ష వేయగ తలచెనూ

10. కంచెయే చేను మేసినట్లు
సతిని కాపాడవలసిన పతి
విస్మరించగ బాధ్యత నింక
యేది రక్షణ స్త్రీలకి?

11. దైవమటంచు నెంచు పతియే
దయ్యమవగను తనకు తానే
రక్షణ పొందగ తక్షణమే
ఆ నరకము వీడెను లలిత

12. భర్తపై ఫిర్యాదుచేసియు
సాధించినదీ విజయమునూ
అన్నివేళల అబలకాదని
సబల కాగల దన్నది



## 11. శిల

1. ఇందు చదివింది ఇంజనీరు
పట్టణములోనె ఉద్యోగం
జీతముకూడ ఎక్కువేనూ
అదృష్టం అన్నారంతా

2. రాత్రిపగలూ భేదమనరూ
ఆడమగా యని తేడా లేదు
దూరాభారం అనగరాదు
పనియే ప్రధాన మక్కడ

3. సహోదరుల చదువులకోసం
అండగ నిలిచి అందించింది
ఆర్థికబలము తండ్రికి ఇందు
మెచ్చుకొనిరందరూ

4. ఆడపిల్లనంటూ జంకక
విధి నిర్వహణ చక్కగ చేయుచు
బాధ్యతలు నెరవేర్చు ఇందును
ఉత్తమురాలన్నారు

5. అనుకున్నది సాధించుటలో
ఆమె పట్టుదల నచ్చినంత
ఇందు కేలందుకొనగోరుచు
ముందుకు వచ్చెను రాము

6. శుభస్య శీఘ్రం మనిరి పెద్దలు
జరిగెను పెండ్లి వేడుకగాను
అక్షతలు జల్లి సంతసముగ
ఆశీర్వదించి రందరు

7. అన్యోన్యమ్ముగ దంపతులును
హాయిగ కాలము గడుపుచుండ
అనుకోని దుర్ఘటన జరిగెను
విధివశంబు నొక నడిరేయి

8. ఇంటికి నొంటిగ వచ్చుచుండ
తుంటరి డ్రైవరు కన్నుకుట్టి
ఇందును పొందగ నెంచినపుడు
యుక్తిగ తప్పించుకొన్నది

9. వింతగ చూసెను పతియు సతిని
చెరిగినబొట్టు చెదిరిన కట్టు
రేగిన జుట్టును బట్టి తలచె
నతడు మానభంగమైనదని

10. చెప్పెను ఇందు జరిగినదంత
మిన్నకుండెను విన్న రామూ
మౌనముద్రను తెలిపె నతండు
తన తిరస్కారమునంత

11. తనను నమ్మని భర్తను గనుచు
దిక్కుతోచక శిలయై నిలిచి
తలచెను ఇందు ప్రేమయుండిన
చోట నమ్మకముండునని

12. గదితలుపు తెరువలేదు భర్త
హృదయకవాటము కూడ మూసి
వేసుకొన్నది గ్రహించి పతిని
ప్రాధేనపడలేదు ఇందు



13. తప్పుచేయని తనకు శిక్షా
యని పరితపించి భవిత గూర్చి
యోచనతోను సాగె ముందుకు
అభిమానవతి ఇందు

14. నమ్మకము లేని చోట యునికి
కర్థములేదని నిర్ణయించి
విడివడ్డ ఇందును గమనించి
సమర్థించిరి కొందరు

## 12. కన్నియ

1. అందములోను అప్సర యేను
చదువులోనూ దిట్టయె తాను
తెలివితేటలు మిక్కుటమేను
ఆ కన్నియపేరు నీరజ

2. ఇంటికి పోయెను సెలవులనీ
గుడికి వెళ్ళీ మ్రొక్కుకున్నది
ఒంటరిగాను తిరిగివచ్చుచూ
పడె నొక తుంటరి కంటను

3. పెరిగిన ఊరు ఎరిగినవారు
కుశలమడిగెను కోమలినపుడు
బదులుచెప్పుచు బయలుదేరెను
ఆ చిన్నది నీరజ

4. అసురసంధ్య నా యసురుండూ
మాటలాడుచు మార్గము మార్చి
తోటనడుమకు తోడ్కొనివచ్చె
ఆ నీరజ నపుడూ

5. రంగు రంగుల పూవులతోను
విరియబూసిన తోటను కనగ
సంబరమాయెను అమ్మడికీ
కిలకిల నవ్వుచునుండె

6. మాయమర్మము లెరుగనిదాని
మైమరచియున్నదానినపుడు
చేయిపట్టీ లాగె నతడూ
కామోద్రేకముతో

7. న్యాయము, నీతిలేవ నీకూ?
ప్రతిఘటించెను ప్రశ్నవేయుచు
నీరజయు తన శాయశక్తులా
కానీ ఫలితం శూన్యం

8. ఆత్మరక్షణ చేసుకొనగను
చేతకాక ఆత్మాహుతియును
చేయలేక అసహాయంగా
నిలబడె నీరజ

9. పండంటి జీవితమ్ము భగ్న
మైన బిడ్డను తల్లిదండ్రులు
చేయునదిలేక ఓదార్చిరి
దిగులుపడుచునే

10. పగబట్టి ప్రతీకారమునూ
పిరికితనముగ ఆత్మహత్యను
తలబెట్టక నీరజ క్షమా
గుణముతో విడచిపెట్టింది.



11. పశ్చాత్తాపము చెంది యతడు
తప్పును మన్నించమని వేడు
కొనగనూ మనువాడినను మేలని
చెప్పిరి పెద్దలందరూ

12. తోచెను సబబుగ ఇరువురకును
కక్ష ప్రక్కకుపెట్టి యప్పుడు
ఇరుపక్షములవారును చేసి
రంతట సుఖాంతమును

## 13. యుక్తి

1. అంతుపట్టని జబ్బుచేయగ
రాజు భార్య సుశీలకు వైద్య
మునకు లొంగనందున అసువులు
బాసి రాజు నొంటరి చేసెను

2. పడవ ప్రమాదములోన పడతి
రమయు పతిని బాయగ ఒంటరి
బ్రతుకును మోయుచుండ కలిపెను
దైవమూ విధివంచితులను

3. ఒక్క వేడుక శుభసమయమున
ఇరువురి కయ్యెను పరిచయమ్ము
వారిని కలిపె నాచెలిమియే
పునర్వివాహము పేరునన్

4. గతమును మరచిముందుకు సాగ
నుద్యమించిరి నవజీవనము
బ్రతుకుబాటను పయనించుటకు
జంటగ నడువసాగిరి

5. కాలము ముందుకు జరుగుచుండ
మనసులు వెనుకకు మరలుచుండె
మదిలో రాజు మధన పడుచును
సుశీలను రమను పోల్చసాగె

6. మాటి మాటికి సవతిని తలచి
భేద మెంచుట నచ్చని రమయు
ఓర్పుగ నేర్పుగ చెప్పదలచె
యుక్తి జోడించి రాజునకు

7. రమ పతి రవి గుణగణములనూ
గొప్పగ చెప్పదొడగె రాజుకి
అంతటితో తెలిసివచ్చెనూ
రాజుకి తాను చేసిన తప్పు

8. కీలెరిగి వాత పెట్టినట్లు
రమ చేష్టలుండ మనసు మార్చు
కొనియును పురుషాధిక్యత నిక
చూపకుండెను రాజు

9. తప్పుదిద్దుకొనుచును రాజూ
ఆవేదన నణచుకొనుచు నిక
నొప్పింపక తానొవ్వక యను
చందము గడపసాగి రపుడు

10. రాజీ పడుటే జీవితమని
కష్టసుఖము లనుభవించుటే
కర్తవ్యమ్మని తెలుసుకొనిరి
చేతులు కలిపి నడచిరీ

11. విధియాడించే వింత నాట
కములో పాత్రలె తామటంచు
కలతలు లేనికాపుర మందు
హాయిగ కాలం గడిపిరీ



## 14. ఆత్మబలం

1. కట్నము కోరని మంచివారు
కమలను కోరి వచ్చిరి వారు
పెండ్లి చేసిరి కానుకలిచ్చి
ఘనముగాను కన్నవారు

2. మూడు నాళ్ళా ముచ్చటాయే
ముదిత మోమూ చిన్నబోయే
ముద్దుమురిపెము లేకపోయే
కమల మనసు మూగవోయె

3. అనుక్షణము అనుమానమే
అడుగడుగనా అవమానమే
అతనితోడను కాపురమ్మును
కత్తిమీద సాము అయ్యే

4. భర్తలో పరివర్తన రాదు
సంసారంలో శాంతి లేదు
ఐనను సహిస్తోంది కమలయు
కుటుంబ గౌరవమ్ము కొఱకు

5. కలతలు కలహాల కాపురం
కలిగా రిద్దరు పిల్లలునూ
ప్రశ్నార్థకమై నిలిచె నెదుట
పిల్లల భావిజీవితము

6. భరించసాగె నతని దౌష్ట్యము
పిల్లల సంరక్షణ కొఱకును
తన్నులు తిన్నను కిమ్మనకనె
కాలము గడపసాగె కమల

7. తల్లి కష్టము చూడలేకను
చదువు శ్రద్ధగ చదువలేకను
పిల్లలు పడునవస్థలు చూచి
తరుణోపాయం వెతికినదీ

8. కన్నబిడ్డల మేలును తలచి
భర్తకు దూరమై బ్రతికింది
చదువు తక్కువైన కమల
పట్టుదలతో సాధించింది

9. చేయుచు చిరు ఉద్యోగమ్మును
పెనుగుండె ధైర్యముతోడనూ
మంచితనమ్మున పెంచినదీ
బిడ్డలను చదివించినదీ

10. బాధ్యత నెరుగని పతియుజేరె
చెంతకు తుదకు! సహనము తోను
జీవన పోరాటము సలిపిన
కమల విజేత కాగలిగింది

11. ధనమ్ము కన్న ధైర్యము మిన్న
విద్యల కన్న విజ్ఞత మిన్న
బలము కన్నను ఆత్మ బలమ్మే
మిన్ననె కమల పట్టుదలతో





# 15. తిరుగుబాటు

1. ఊర నుండిరి మిత్రు లిరువురు
కలిమి నిరువురు సరితూగుదురు
ఒకరి కుండె అమ్మాయొకతె
ఒకరికుండెను మగపిల్లాడు

2. నెయ్యము వియ్యమైన చాలని
తలచినంతనె శుభమస్తనిరి
బంధువర్గము తథాస్తు అనిరి
దేవతలు కూడను

3. కల్యాణం కమనీయ మగుచు
కన్నుల పండుగ చేసిరంత
ఆ వధూవరుల దీవించి
రందరు దీర్ఘాయురస్తని !

4. చింతయు లేక నవదంపతులు
భోగభాగ్యముల తులతూగుచు
కాలము హాయిగ గడుపుచుండ
పరుగు తీసె పది వత్సరములు

5. మిత్రులిద్దరు సంతసించిరి
ముద్దుబిడ్డల ముచ్చట్లు గని
తాతలుకావలెనని తలచుచు
చూడసాగిరి మనుమల కొరకు

6. ఆశతో కట్టిరి ముడుపులను
భక్తితో చేసిరి తీర్థయాత్రలను
అనేక మ్రొక్కులు మ్రొక్కిననూ
ఫలితము శూన్యమయ్యె!

7. వైద్యులు చేసి పరీక్ష లెన్నో
బిడ్డలామెకు కలుగరంచని
చెప్పినంతనె తల్లడిల్లిరి
తల్లిదండ్రులునూ

8. వైద్యశాస్త్రము కందని విధము
దైవ నిర్ణయముండె చిత్రము
కలిమియున్నను సంతానలేమి
బాధించె వారి నమితముగా

9. కోడలు గొడ్రాలనిరి మరియు
మళ్ళీ పెళ్ళని మొదలుపెట్టిరి
కొడుకుని కన్నతల్లి తండ్రులు
వంశాంకురం కోసమనీ

10. సంతు కోసము సతిని మోసము
చేయుట తగదని మొత్తుకొనిరి
ఆడపిల్లను కన్నవారిక
దిమ్మెరపోయెను అబ్బాయి

11. కోరి వియ్యమునంది మిత్రులు
మనుమల కొఅకు కయ్యము లాడు
తమ జననీజనకులను గనగ
మతులు పోయె నా దంపతులకు

12. సంతు లేకున్న సంతసమ్ము
లేదా? సతీపతులు మనస్సులు
కలిసి జీవించిన చాలదా
అమ్మ డడిగెను ధైర్యంగా

13. సంతతికొరకు సవతి పోరును
భరించమనుట ఘోరము కాదా?
అట్టి లోపమ్మె మగని దైన
అప్పుడేం చేస్తారు?



14. పూర్వకాలము స్త్రీలు కారే
నేటివా రన్యాయము నెల్ల
సహించరూ ప్రకటిస్తారూ
ధైర్యంగా తిరుగుబాటును!

15. ఆమె నోటిని ధాటిని వినగ
భర్తయు, పెద్దలు బదులు పలుక
మాటరాక మిన్నకుండిరి
ఔను ఆమె నేటి వనిత!

## 16. సంస్కారం

1. కూతురి పెళ్ళిచేసిరి వారు
ఉన్నదంతా ఊడ్చిపెట్టియు
గిఱ్రున తిరుగగనేడాదికి
పుట్టె మనుమడు ముద్దుగొలుపుచు

2. రెండవ కాన్పు కవలలు కలిగె
ఆడపిల్లలగుటను ఆమెదె
తప్పుగా సాధించసాగిరి
భర్తయు అత్తమామలూ

3. కూతురి గూర్చి కుమలసాగిరి
తమరి ఆర్థికదుస్థితి తలచి
తల్లిదండ్రులు పిల్లల పెంచ
తామసహాయు లనిరీ

4. చాలీచాలని రాబడితో
పెంచలేము పెంపిద్దామనె
భర్త, అత్తమామలు చేసిరి
నిర్ణయమ్ము తుదకు

5. అమ్మ మనసంగీకరించక
ప్రతిఘటించె నామె తన శక్తి
కొలదిని అంతటితో సమస్య
తీరిందని తలచిన దామె

6. గడచె నటులనె కొద్ది రోజులు
ఒక శుభోదయంబు నొక పాప
కానరాక పోవగ తల్లికి
తల్లడిల్లెను హృదయము

7. కసాయివాడా కన్నతండ్రి
అమ్మివేసెను కన్నబిడ్డను
నిజము నెరిగిన కన్నతల్లికి
గుండె నీరై పోయెను

8. ద్వేషమసహ్యము కలిగినంత
రెండవ పాపనైనను తాను
దక్కించుకొన నెంచి నడిచెను
బయటకు పాపనెత్తుకుని

9. ఆడపుట్టుక శాపము కాదు
ఆడపిల్ల బరువూ కాదు
ఆత్మస్థైర్యంతో జీవించ
గలమన్నది ఆమె

10. కులముకాదు గుణము ప్రధానము
ధనముకన్న అభిమానధనము
మిన్న! చదువు కంటెను సంస్కార
మే మిన్న యన్నదామె



## 17. బలి

1. తెచ్చిరి అందమైన వరునీ
ఇచ్చిరి కోరినంత కట్నం
పరిణయముచేసి పట్టిని గని
ముచ్చటైన జంటని మురిసిరి

2. అత్తవారింటిలో అమ్మడు
పతి యనురాగము పొందుచునూ
అత్తమామల ఆదరణమ్ము
అందుకొనగ ఆనందించిరి

3. మూడు ఏండ్లూ గడచునంతనె
ముట్టజెప్పిరి కానుకలెన్నో
అల్లునకు అత్తవారికినీ
ఘనమైన వేడుకలుగా

4. ఇచ్చిన కొలదిని పుచ్చుకొనుచు
ఇవ్వకున్న అలిగి అల్లుడు
పిల్లను మొదలిడె పీడించగ
అందము మనసుకు లేదయ్యె

5. సొమ్ము తెమ్మనిరి అత్యాశను
ఆడుబిడ్డలు అత్తయు పతియు
క్రూరముగ హింసించసాగిరి
రోదించె నామె

6. ఇంక నామె తొలగిన చాలని
అడ్డు తీరును మరల పెళ్ళిని
చేసిన కట్నము 'వచ్చునంచు
దురాశకు లోనైరి వారు

7. తీయని మాటలు చెప్పుచునూ
తీపి తినిపించిరీ వారూ
గుడ్డిగ నమ్మి యామె తిన్నది
విషభరితమ్మని తెలియకను

8. ఉన్నదని కొనఊపిరితోను
పొల్పడె నాత్మహత్య కనుచును
కన్నవారికి కబురు నంపిరి
గుండె చెరువై వచ్చిరివారు

9. కన్నవారికిని కడసారిగ
తన మరణానికి కారణమ్మును
కడగండ్లను చెప్పి మూసెను
కన్నులు కడుదీనముగా

10. అత్తవారి ధనదాహమేను
బిడ్డను బలిగొనెనను నిజమున్
తెలిసిన తల్లిదండ్రులు దుఃఖ
సముద్రమున మునిగిపోయిరి

11. బిడ్డను హత్యచేసిరనుచూ
వ్యాజ్యము వేసి రత్తవారిపై
న్యాయ మర్థించి విచారముతో
తల్లిదండ్రు లప్పుడు

12. అంతయు విచారించిన పిదప
న్యాయమూర్తియు చెప్పిరి తీర్పు
జీవితాంతము అత్తవారికి
కారాగార శిక్షను



13. ఆ దురాశాపరులకు మరొక
అబల బలికారాదటంచును
తగిన శిక్ష పడినది యంచని
భావించి రందరూ

14. జీవన సమరములో విజయం
పొందుటలోన స్త్రీలు పురుషులు
సమానమనుటె గాని జరుగుచు
నేయున్న విట్టి ఘోరమల్

## 18. నిజము

1. అంతరించెను బాల్యవివాహ
ములును సతీసహగమనముల్
నేటి వనితలు నాటికంటెను
బ్రతుకుచుండిరి ప్రగతి పథము

2. కాని మారగలేదు యిరువురి
మధ్యను వ్యత్యాసములన్ని
చదువు పదవులు సమానముగా
సాధించినా సంఘంలో

3. ఆలుమగలూ నడుపుచుండిన
సాగు సంసారమనెడు నౌక
నిర్వహణలో స్త్రీ పురుషులూ
సమాన బాధ్యులే కదా!

4. అంగన లన్ని రంగములలో
చూపుచుండిరి సామర్థ్యమును
పడుచు పోటీ పురుషులతోడ
నింక భేదమెందుకూ ?

5. పరస్పర సహకారముతోను
విజయము పొందుచు దేశమంత
సుభిక్షమగుట వాంఛనీయము
అదియె వరమనుట నిజము

## 19. కరిగిన కల

1. స్వాతి పుట్టె సంపన్నులింట
మెట్టినింటను మెండు సంపదె
రెంటిని తలచి సమానముగా
స్వాతి సంబరపడుచుండెనూ

2. తెలిసివచ్చెను తేడాలెన్నో
క్రమక్రమముగ స్వాతి కప్పుడు
అంతుపట్టకపోయెను అత్త
మామల ఆంతర్యములూ

3. మితినిమీరేటి గారాబము
పెంచిరి సుతుని దుగలవాట్లుకు
పాలగుచు పాడైనను వారు
పట్టించుకొనక నుండిరి

4. నరకమాయెను బ్రతుకు స్వాతికి
ఇంటి సంగతి పట్టని పతిగని
తప్పి మతియా సతికి తలచెను
తనగతి అధోగతి యటంచు

5. చూపసాగిరి సానుభూతిని
ఇరుగు పొరుగూ స్వాతిపైనను
ముద్దుముచ్చట లేనిది ముదిత
కాపురమంచని వారు



6. భక్తియు లేదు దైవమన్నను
గౌరవము లేదు పెద్దలన్న
అనురాగమును లేదు వాసుకి
అర్ధాంగి స్వాతి యన్నను

7. బానిసాయెను మద్యమునకూ
తల్లిదండ్రులు సతిని కూడా
డబ్బుతెమ్మని తిట్టిపోయుచు
సదా పీడించసాగె

8. దినదిన గండమాయె వారికి
సామదానభేదములకునూ
దీనముగా వేడుకొనగనూ
రాకపోయె పరివర్తన

9. పడతి నొకతెను వెంట తెచ్చిన
మగనిపై ద్వేషమ్ము రగిలిన
స్వాతి రోషకషాయిత నేత్రి
తోకత్రొక్కిన త్రాచునయ్యె

10. బుసనుకొట్టుచు కసిగ తిట్టుచు
తిరుగుబాటు ప్రకటించెనప్పుడు
ఆవేశమును పట్టలేకను
స్వాతి అరచెను గట్టిగా

11. కోరి తెచ్చిన కోమలిముందు
తలచె నవమానంగా వాసు
తన ప్రతాపము చూపెద నంచు
స్వాతి గొంతును చేతనుబట్టె

12. త్రాగి మైకం క్రమ్మిన పతిని
ప్రతిఘటించగలేక స్వాతియు
సతమతమగుచును తుదకెటులో
విడివడె నాతని పట్టునుండి

13. మనువు తోడనె మలుపు తిరుగును
మగువకు జీవిత మనగ నుండె
పుణ్యముకొలది పురుషుడన్నది
సామెత కొనసాగుచున్నదీ

14. మద్యపానము మరియు పొగనూ
త్రాగుట హానికరమని తెలిసి
మాననీ బలహీనుడు మగని
ఏమనగలదు?

## 20. ఆమె

1. భాగ్యమగు నారోగ్యముతోను
ధైర్యమే ఆభరణముగాను
సహనశీలిగా త్యాగమూర్తి
యనగ పేరుపొందె నామె

2. ఆమె పతికి ప్రియమైన పత్ని
పిల్లలకు పెన్నిధివంటి అమ్మ
అత్తమామలకు సేవచేయు
మంచికోడలు నామె

3. పతివియోగ దుఃఖముతోడను
రెక్కలొచ్చిన పిల్ల లెగురగ
మిగిలిపోయె వృద్ధాప్యంలో
ఒంటరిగ ఈనాడామె



4. తాను కరుగుతూ వెలుగునిచ్చు
కొవ్వొత్తికీ సత్తువ లేకను
మూలపడిన ముదుసలి తనకూ
భేదం లేదని తలచిందామె

5. తల్లి బరువుగ తోచెనేమో
కన్నబిడ్డలకంచు కుములుచు
తనవంటివా రుండతగినది
ఆశ్రమవాసమె అన్నదామె

6. తల్లితండ్రులు నాటిరోజునె
ఆడపిల్ల వలదనుకుంటే
బాధలన్నవి తనకు నేడిక
తప్పియుండని తలచె నామె

7. పురుషులకంటె సమస్యలన్ని
స్త్రీలకుండు నన్నిదశలలో
అన్నిదశలూ దాటి ముదిమిని
గడచుటె ముఖ్య మన్నదామె

8. మూలుగుతూ ముదుసలి చెప్పెను
దీనన్ పుత్రపరిత్యక్తనంచు
కోడలిపోరె కారణమనె
స్త్రీకి స్త్రీయే శతృవగున?

9. తనవంటి నిర్భాగ్యులెంద
రో యటంచును తల్లితండ్రుల
ఆశ్రమంబుల పాలుజేయుటె
సంస్కృతియా అని కుమిలెనామె

## 21. దీప్తి

1. దంపతులైరి సీత రఘులును
ఒకరినొకరు ప్రేమించుకునీ
కలతలులేని కాపురమనగ
గృహము స్వర్గసీమగ నొప్పె

2. కొంతకాలము గడచిన పిదప
కలిగె పాపాయి వారికినీ
ముద్దులు మూట కట్టుచు
కన్నులపండుగ చేయగ

3. కన్నతల్లియు బిడ్డను చూచి
మురిసిపోవుచునుండ భర్తయు
అత్తమామలు ఈసడించిరి
పండుగకాదు దండగనీ

4. మూడునెలలైననూ తిరిగీ
చూడని భర్త చెంతకు పయన
మాయెను సీత బిడ్డతోడను
తల్లితండ్రుల తోడనూ

5. ఆదరించక పేరు పెట్టక
తల్లిని బిడ్డను తరిమివేసి
రా నరరూపరాక్షసు లపుడు
ఆడపిల్లను కనుటె తప్పని

6. సీత చేరెను పుట్టినింటికి
కలకలలాడు కాపురమింక
కల్లకాగ పుట్టెడు దుఃఖము
తోడను బిడ్డతోడను



7. సేదతీరుచు తల్లి ఒడిలో
తన యొడి బిడ్డను చేరదీసె
కన్నతల్లిగ సీత మురియుచు
మాతృహృదయము ఘనత అదియె

8. దీప్తివంతమగు భవిత కోరి
నామకరణము చేసెను 'దీప్తి'
యనుచు పాపకు దానికోసమె
తాను బ్రతుక తలచెనూ

9. ఆడుచు పాడుచు పెరిగి దీప్తి
విద్యకు తోడు వినయము నేర్చి
మంచిపేరును తెచ్చుకొన్నది
తల్లికి ముదమును కూర్చినదీ

10. చిన్న ఉద్యోగమ్ము చేయుచు
పెద్ద చదువు చదివించినదీ
తనదు కష్టము ఫలించ మురిసి
దీవించింది దీప్తిని

11. పాఠశాలను ప్రథమశ్రేణిని
నిలిచి బంగరు పతకమునందు
కొని యుపకారవేతన మందు
కొని తల్లికి దీప్తిగ నిలిచింది!



## 22. పూజ

1. తల్లికి "టాట" చెప్పియు తరలి
పోయె పూజా బడికి ఉదయమె
ఇంటిపనుల మునిగిన తల్లికి
వినిపించెను పూజ పిలుపు

2. అంతలోనే వచ్చెనెందుకు?
వింతగ తోచె తల్లి శాంతకు
గాభరాపడుచు పూజనుగని
తెల్లబోయె నాపిల్ల ఏడ్పుకు

3. కారణమరయ కన్నులు తిరిగె
ఆడజన్మయె అంత అలుసా!
తల్లిహృదయము తల్లడిల్లగ
పూజనక్కున చేర్చుకొనెను

4. పాఠశాలను కీచక గురువు
చేసిన పనికి బెదిరిన పూజ
పరుగున పాతి చేరెనింటికి
తల్లి శాంత పొందెనశాంతి

5. కాపురుషుల కావర మణచగ
కావలె కాంతలు ధైర్యవంతులు
తాము సబలలమంచును నిరూ
పించగ కోర్టునకెక్కె

6. న్యాయపోరాటమున నిలిచిరి
వారు తప్పుచేసిన వారికి
శిక్షపడగ పూజకు ఉన్నత
విద్యనందించ గెలిచిరీ



7. తండ్రిలేని పూజకు తల్లియు
తండ్రియు తానై సమస్యలను
పరిష్కరించ గలిగెను శాంత
తన పట్టుదలతోడనూ

8. అధిగమించె పురుషాధిక్యత
సహించమంచును అన్యాయము
ఆడవారిని చిన్నబుచ్చుట
తగదంచు చెప్పెను బుద్ధి

9. మగనియండలేని వనితలకు
గుండె ధైర్యము నుండిన చాలు
జీవిత నౌకను నడుప గంచు
నిరూపించెను శాంత

## 23. అతివ - అగచాట్లు

1. స్త్రీలు చేయును కాపురమ్మును
పతియె గతియను నమ్మకమ్మున
తరుణి తలచును పిల్లలే యను
సర్వస్వము తనకంచు

2. నవమాసాలు నవ్వుచు మోసి
ఇష్టదైవము ప్రార్థన చేసి
కష్ట సుఖముల కావడి చూసి
బిడ్డలను పెంచును తల్లి

3. అతివ ఆనందించున దెపుడు?
భర్తప్రేమను పంచి నప్పుడు
బిడ్డలు ఆదరించి నప్పుడు
మనుగడ సార్థక మప్పుడె

4. కొంతమందికె అదియు లభ్యం
ఆస్తికోసం ఆశతోడను
అలిని చంపు భర్తలుండగ
సతికి పతిప్రేమ లభ్యమా

5. బిడ్డ లెదిగినపిమ్మట వారు
తల్లిదండ్రుల మాటె మరచీ
రెక్కలు వచ్చిన పక్షులల్లె
ఎగిరిన వారి ప్రేమ లభ్యమా?

6. కనగ ఆత్మీయతలు అనుబం
ధాలును కనుమరుగై పోతూం
డగ కలికాలము మార్పులందుమ?
విధివైపరీత్యమందుమా?

7. ఇంటికి దీపమె ఇంతి యంచును
ఆడదే ఆధార మనుచునె
సతిని హింసించు చుండగాను
అతివకు అగచాట్లే కద!

8. పతిని, సంతును సంతస పరచు
గృహలక్ష్మిగా గుర్తించినపుడె
మహిళకు దక్కును గౌరవమ్ము
కోరుదురది కోమలు లంత





## 24. ఆదర్శం

1. ఆటంకాలను అధిగమించి
సమాన హక్కులు పొందినదీ
లక్ష్యసాధన కోరి ముందుకు
దూసుకుపోతోంది ముదిత

2. రాణించింది రాజకీయం
చేసినది పర్వతారోహణ
నడిపినదీ విమానములనూ
వినువీధిని విహంగమై

3. ఆటలు చదువుల పోటీపడి
నుద్యమించెను అన్నివిధముల
చూపి సామర్థ్యమును పేరును
ప్రతిష్టలొందినది పడతి

4. ఇంటను మాత్రమామె పాపము
అనామికయే నిరాదరణకు
నిరాశపడక కుటుంబములో
మార్పుకు ఎదురుచూసింది

5. ఇంట దొరకని గుర్తింపయ్యె
విజయోత్సాహము లేకపోయె
భర్త సహనము పొందకపోయె
చింతమాత్రము వీడదయ్యె

6. ఆశయమ్ములు ఆదర్శములు
ఆచరణలో అసాధ్యమయ్యె
ఇంట గెలిచి రచ్చ గెలువమను
సూక్తి తారుమారుగ నయ్యె

7. భరించువాడు భర్తయన్నను
భార్య కీర్తిని భరించలేక
మనసుతీరగ ప్రోత్సహించక
అభివృద్ధి నిరోధకుడయ్యె

8. సర్దుబాటుయె జీవితమన్న
అది మగవారిలోన సున్నా
సహనము ఓర్పు ఎంతఉన్నను
ఆడవారికేనా అవసరం?

9. పెళ్ళినాటి ప్రమాణములతో
కష్టసుఖములు కలసి పంచుకొని
ఆలుమగలూ నేడు-రేపూ
హాయిగ గడుపుటె ఆదర్శం

## 25. రక్ష

1. అంతరించెను అంతరమ్ములు
అంతరిక్షము నందు నతివయు
అంతులేని కృషి సలుపుచునూ
ధైర్యంగా నిలబడుతోంది

2. పాత తరముల నాటి మహిళల
కంటె ఎన్నోరెట్లు మెరుగై
పురుషులతో సమాన శైలిని
స్త్రీ బ్రతుకుతోంది స్వేచ్ఛగా

3. ఊహలు మారెను పెంపకమ్ము
సరళియు మారెను పిల్ల లెదుగు
చుండిరి ఆడ మగ భేదమ్ము
నెరుగకనె నేటి కాలము



4. ఐననూ కరువాయె రక్షణ
బలియగుచుండిరి బాలికలూ
అత్యాచారము హింసలకును
ఇక ఇంతులకు దైవమె రక్ష

## 26. నిర్భయ

1. కంచెయె చేనుమెసె ననంగ
కాచు పోలీసులే కాటే
యగా స్త్రీలకు రక్షనెచ్చట?
అజ్ఞాతమే శరణ్యామా?

2. 'నిర్భయ' చట్టమేను! వనితకు
నిర్భయ మెక్కడుంది? భయమే
ఉన్నదీరాత్రి పగలును కూడ
అభద్రతా భావమే!

3. పూర్వముండె నరుదుగ నత్యా
చారములు కాని నేడు జరుగు
చుండె తరచన్నది పురోగ
మనమా? తిరోగమనమా?

4. బాలిక కన్య ప్రౌఢ చివరకు
వృద్ధ వనిత సహితము భయపడు
దుష్టకాలము దాపురించగ
ప్రాణాంతక మయ్యెనే

5. వృత్తివిద్యలు నేర్చి మహిళలు
తమ విధి నిర్వహణను చేయుచు
స్వేచ్ఛకోరుట నేరమగునా?
వారి నలుసుచేయుట తగున?

# 27. హాసము

1. పెంపకమ్మున పంపకమ్ముల
భేదమన్నది యుండరాదు
ఆడ, మగపిల్లలను పెద్దలు
చూడవలె సమానముగన్

2. అత్తవారింట నగచాట్లును
కట్నపిశాచికి బలికాబడు
కష్టములన్నియు కడతేరిన
నాడే స్త్రీకి సంతసం

3. చదువు ఉద్యోగమ్ములందున
అబల అధికారమును అత్యా
చారములను కనివిని ఎరుగని
నాడే స్త్రీకి ఆనందం

4. ఆర్థిక స్వాతంత్ర్యము కలిగి
ఒంటరియైన నాత్మవిశ్వా
సమున నిశ్చింతగ బ్రతుకగల
నాడే స్త్రీకి దరహాసం

5. ఇంతిమోమున చెరుగనీయని
చిరు దరహాస మెల్లవేళల
నిండు పున్నమి వెన్నెల వోలె
నుండ కోరుద మెల్లకున్



# 28. ఆధిక్యత - అసహనం

1. తల్లిలేనీ పిల్లడంచును
భాను మేనల్లుడనుచూ
తెచ్చి పెంచిరి ప్రేమతోడను
తనయ ఛాయతో బాటుగా

2. చిరుతప్రాయము నుండి వారూ
కలసి మెలసీ పెరిగి చదివిరి
కళాశాలను కూడ యిరువురు
ఒక్క తరగతిలో నుండిరి

3. తెలివితేటల ఛాయ కన్నియు
మొదటి మార్కులె వచ్చుచుండగ
మెచ్చి యిచ్చిరి పసిడిపతకము
భాను కదితోచె నీసుగా

4. వరుస కుదిరిన మేనరికమ్ము
పెళ్ళిచేయగ పెద్ద లెంచిరి
ఇష్టమున్నను ఈర్ష్యచేతను
భాను చెప్పె సాకులు

5. పెట్టె షరతును పెళ్ళి కతండు
ఛాయ యింకను చదువరాదూ
తనకు ఛాయగ మాత్రమెయుండ
వలయుననియెనూ

6. చిన్ననాటీ నిర్ణయమునూ
పెద్దలందరి కోరికలనూ
కాదనలేక ఛాయ చదువును
మాని పెండ్లికి తలవంచెను

## 29. పెనుభూతం

1. పెండ్లి జరిగీ పద్మ ప్రభునకు
ఒక్క వర్షము తిరిగె గిర్రున
తొలిచివేయగ సాగె నాతని
మెదడు ననుమానపిశాచము

2. అందగత్తెయనియు చదువులో
చేయు నుద్యోగమ్ములోనను
తనకు సమానమంచని యెంచి
కోరి పెండ్లియాడె నతడు

3. అందరితోడను కలుపుగోలు
తనముగనుండు పద్మ కుండిరి
స్నేహ బృందము ప్రభునకు కంటె
అధిక సంఖ్యలో

4. గర్వపడెను తొలుతను ప్రభుయే
భార్య రూపగుణమ్ములకునూ
కాని ఆ అభిమానము మార
సాగెను అనుమానంగా

5. అడుగడుగునా ఆమె పైనను
చూపసాగె ననుమానమునూ
భర్త ధోరణి బాధగొలుపగ
మతి గతితప్పె నామెకూ

6. జాలి కలిగె నతని బలహీన
తకూ తోచె నవమానముగా
నచ్చచెప్పిన లేక ఫలితము
భారముగ నేండ్లు గడపెను



7. సంతు కలిగిన పిదపనైనా
భర్త సందేహించుటమాన
నపుడు విరక్తి కలిగె నామెకు
బ్రతుకు పైననూ

8. ఆత్మహత్యకు పాల్పడంగను
తలచికూడను సంశయించెను
తప్పుచేయని తనకు భయపడ
నవసరము లేదనుకొనెనూ

9. తనదు ఆత్మాహుతని చూచీ
తలతురేమో భర్త మాటయె
నిజమటంచని తలచి పద్మయు
పిరికితనమును తరిమివేసెను

10. ధైర్యముగ నిలబడి సరిదిద్ది
పతికి కలిగించె కనువిప్పును
క్షమాభిక్షను కోరి ప్రభుయును
కాలము గడిపిరి సుఖముగా

## 30. నారి-నాడు-నేడు

1. నాడు విద్యావంతులు కాని
బాలికలుండె నేడు విద్యా
ధికులు బాలిక లైరి పోటీ
పడుచూ బాలురతో.

2. బాల్యవివాహములా నాటివి
ప్రేమ పెండ్లిండ్లయ్యె నేటివి
స్వతంత్రత స్త్రీకి లేదప్పుడు
సర్వస్వతంత్రు రాలిపుడు

3. భర్తపై భయభక్తు లానాడు
ప్రేమ అభిమానమ్ములు నేడు
స్త్రీకి యిల్లే సర్వమునాడు
లోకజ్ఞానము నొందెను నేడు

4. పిల్లల పెంపకమ్ము పెద్దల
సేవయే పని నాటి వనితకు
వాటికి తోడు పెరిగె నుద్యోగ
బాధ్యతలూ నేడు

5. నిర్వహించు విధుల సంతట
ఇంటను గెలిచి రచ్చను గెలిచి
ఆర్థిక స్వాతంత్ర్యముతోను
నిలిచింది ఇంతిహాసముతో

6. ఆలుమగలేకత్రాటి పైన
నిలుచు సంసారము సరిగమలు
పాడు పూలును దారము గూర్చు
దండగ నొప్పు ధరణిన్

## 31. అక్రమం

1. కాలమంతయు మారిపోయెను
మానవత్వము మంటకలిసెను
వావివరుసలు మరచిపోయెను
కామము కళ్ళు కప్పెను

2. అంతరించెను విలువ లన్నియు
దేశసంస్కృతి విస్మరించిరి
గండమాయెను దినదినమ్మును
స్త్రీ బ్రతుకు భారమాయెను



3. తల్లితండ్రుల వంటివారని
అత్తమామల సేవ చేయుచు
ఇంట నుండెడు కోడలిపొందు
కోరు మామగారుండిరే

4. తప్పుఒప్పులు తెలియజెప్పెడు
పెద్దలే మరి తప్పుత్రోవల
పట్టుచుండగ యువత సంగతి
ఆ దేమున కెరుక?

5. ఇంటియందున బయటకూడను
స్త్రీకి భద్రత కరువగుచుండ
మాన సంరక్షణకు ఫణముగ
ప్రాణము లర్పించుచుండె

6. ఎంత పురోభివృద్ధి సాధిం
చినను పూర్వముకంటె అక్రమ
చర్యలు పెరిగి చిక్కులలోన
చిక్కుకొనుచున్నది పడతి

7. ఈ అవినీతి అంతమొందగ
కఠిన చర్యలు గైకొనంగను
ఎత్తవలెనా దైవము మరో
అవతారమునూ

## 32. ధన్యజీవి

1. పుట్టుక ముందును వెనుక నుండు
గండములు దాటి 'బాల' పెరుగు
ప్రౌఢ సంసారగుండమ్ము
గండములు గడచి వృద్ధ యగున్

2. గృహిణిగా సహజీవ యానము
సంతసమ్మునసాగి, సంతతి
కలిగి ధన్యజీవియె యగును
ధరణిని తరుణి

3. భర్తయు పిల్లలు ప్రేమ పంచి
పిదప ఒంటరిదైనను ముదిమి
హాయిగ గడుప గల్గిన నాడె
ధన్యజీవి వనిత

4. శిక్షణలోన పెరిగినట్టి
సభ్యత సంస్కృతి తెలిసినట్టి
మనసూ మమతా కలిగినట్టి
పిల్లల తల్లియె ధన్యజీవి

